# ఆంగ్లేయవైద్యచింతామణి అనుబంధము.

# SUPPLEMENT TO THE ANGLEYA VYDYA CHINTAMANI

BY

C. SETUMADHAVA ROW.

సేతు ముద్రాక్షరశాల యందు

ముద్రితమై

సేతు బ్రదర్సుచేఁ బ్రకటింపఁబడియె.

మచిలీపట్నము

1910

# ఆంగ్లేయవైద్యచింతామణి అనుబంధము.

# SUPPLEMENT TO THE ANGLEYA VYDYA CHINTAMANI

BY

C. SETUMADHAVA ROW.

సేతు ముద్రాక్షరశాల యందు

ముద్రితమై

సేతు బ్రదర్సుచే ప్రకటింపఁబడియె.

మచిలీపట్నము.

1910



# మోతాదుల పట్టిక.



ఆంగ్లేయ ఔషధముల లో సాధారణముగ వాడుక యందుండెడి వాటియొక్క మోతాదు లీక్రింద వివరింప బడినవి. ఈపట్టిక యందలి మోతాదులు ఇంగ్లాండు దేశమందు సర్వజనులకు ప్రమాణ గ్రంథమగు "బ్రిటిష్ ఫార్మకోపియా" ననుసరించి వ్రాయబడినవి. ఈ గ్రంథముతో సంబంధించని కొద్దిపాటి యితర ఔషధములకు, నితర ప్రమాణ గ్రంథములను బట్టి మోతాదులు యేర్పఱచబడినవి. ఇందలి మోతాదులు, సామాన్యగతుల యందు, వయస్కుల కేర్పరుప బడియున్నవి. శరీరతత్వమును, ఇతరసందర్భములను, అనుసరించి మోతాదులందు వివేచనయుతమగు కొద్దిమార్పులను జేసికొనినను జేసికొనవచ్చును.

వయస్సును బట్టి నిర్ణయింప వలసిన మోతాదును గురించి ఆంగ్లేయ వైద్యచింతామణియొక్క 24 వ పుటలో వ్రాయబడియున్నది. అయినను, ఒక వైద్య శాస్త్రజ్ఞుని యొక్క పద్ధతిని బట్టి, నిర్ణీతమైన మోతాదును $\frac{\text{రోగియొక్క వయస్సు}}{\text{రోగియొక్క వయస్సు} + 12}$ చే గలిగిన భిన్నము ప్రకారము, అసలు మోతాదు నందు భాగము నేర్పరచి యియ్యవలయునని స్థిర పరచి యున్నాడు. ఎట్లనగా వయస్కునకు 1 గ్రెయిను మోతాదుగ నేర్పరుపబడిన ఔషధము, యీక్రింది ప్రకారము వయస్సునుబట్టి మోతాదును స్థిరపరుప నగును:—

| | | | |
|---|---|---|---|
| 1 సంవత్సరము వయస్సుగలబిడ్డకు | ... | $\frac{1}{1+12} = \frac{1}{13}$ | గ్రెయిను. |
| 2 సం॥ ల వయస్సు గల బిడ్డకు | ... | $\frac{2}{2+12} = \frac{1}{7}$ | ,, |
| 3 సం ,, ,, ,, | ... | $\frac{3}{3+12} = \frac{1}{5}$ | ,, |
| 8 సం ,, ,, ,, | ... | $\frac{8}{8+12} = \frac{2}{5}$ | ,, |
| 12 సం ,, ,, ,, | ... | $\frac{12}{12+12} = \frac{1}{2}$ | ,, |

ఇందు, ఈక్రింది సూచనాక్షరములను గమనింప నగును. డ్రా॥= డ్రాము; గ్రె॥= గ్రెయిను; మి॥= మినిము; మొ॥= మొదలు. సాలిడ్ అనగా ఘనపదార్థము. లిక్విడ్ అనగా ద్రవపదార్థము.

అ

| | | | |
|---|---|---|---|
| అమ్మోనియా అయొడైడ్ | ... | ... | 3 గ్రె॥ మొ. 20 గ్రె॥ |
| ,, కార్బనస్ | ... | ... | 3 గ్రె॥ మొ. 10 గ్రె॥ |
| ,, క్లోరైడ్ | ... | ... | 5 గ్రె॥ మొ. 20 గ్రె॥ |
| ,, పిక్రిస్ | ... | ... | $\frac{1}{8}$ గ్రె॥ మొ. $1\frac{1}{2}$ గ్రె॥ |
| ,, ఫాస్ఫస్ | ... | ... | 5 గ్రె॥ మొ. 20 గ్రె॥ |
| ,, బెంజోస్ | ... | ... | 5 గ్రె॥ మొ. 15 గ్రె॥ |
| ,, బ్రోమైడ్ | ... | ... | 5 గ్రె॥ మొ. 30 గ్రె॥ |
| అయొడోఫారం ... | ... | ... | $\frac{1}{2}$ గ్రె॥ మొ. 3 గ్రె॥ |

ఆ

| | | | |
|---|---|---|---|
| ఆమిల్ నైట్రస్ (లోనకుపీల్చుటకు) | ... | ... | 2 మి॥ మొ. 5 మి॥ |
| ఆర్జెంటం నైట్రస్ ... | ... | ... | $\frac{1}{4}$ గ్రె॥ మొ. $\frac{1}{2}$ గ్రె॥ |
| ఆర్సెనియై అయొడైడ్ ... | ... | ... | $\frac{1}{20}$ గ్రె॥ మొ. $\frac{1}{5}$ గ్రె॥ |
| ఆంటిపైరిన్ ... | ... | ... | 5 గ్రె॥ మొ. 20 గ్రె॥ |
| ఆంటిమొనియాలిస్ టార్ట్రేటం పల్విస్; చెమటను వృద్ధిపరుచుటకు | | | $\frac{1}{24}$ గ్రె॥ మొ. $\frac{1}{8}$ గ్రె॥ |
| ,, ,, ,, | | వాంతికారిగ | 1 గ్రె॥ మొ. 3 గ్రె॥ |
| ఆంటిఫిబ్రిన్ ... | ... | ... | 1 గ్రె॥ మొ. 2 గ్రె॥ |
| ఆలం (పటిగ) ... | ... | ... | 5 గ్రె॥ మొ. 10 గ్రె॥ |
| ఆసిడ్ ఆసిటిక్ ... | ... | ... | $\frac{1}{4}$ మి॥ మొ. 15 మి॥ |
| ,, కార్బాలిక్ ... | ... | ... | 1 గ్రె॥ మొ. 3 గ్రె॥ |
| ,, గ్యాలిక్ ... | ... | ... | 5 గ్రె॥ మొ. 15 గ్రె॥ |
| ,, టార్టారిక్ ... | ... | ... | 5 గ్రె॥ మొ. 20 గ్రె॥ |
| ,, ట్యానిక్ ... | ... | ... | 2 గ్రె॥ మొ. 5 గ్రె॥ |
| ,, నైట్రిక్ డిల్యూట్ | ... | ... | 5 మి॥ మొ. 20 మి॥ |
| ,, నైట్రో హైడ్రోక్లోరిక్ డిల్యూట్ | | ... | 5 మి॥ మొ. 20 మి॥ |

| | | |
|---|---|---|
| ,, పిక్రిక్ ... ... | ... | ½ గ్రా॥ మొ. 2 గ్రా॥ |
| ,, ఫాస్ఫారిక్ డిల్యూట్ ... | ... | 5 మి॥ మొ. 20 మి॥ |
| ,, బెంజాయిక్ ... ... | ... | 5 గ్రా॥ మొ. 15 గ్రా॥ |
| ,, బోరిక్ ... ... | ... | 5 గ్రా॥ మొ. 15 గ్రా॥ |
| ,, సల్ఫ్యూరిక్ ఆరోమేటిక్ ... | ... | 5 మి॥ మొ. 20 మి॥ |
| ,, సల్ఫ్యూరిక్ డిల్యూట్ ... | ... | 5 మి॥ మొ. 20 మి॥ |
| ,, సాలిసైలిక్ ... ... | ... | 5 గ్రా॥ మొ. 20 గ్రా॥ |
| ,, సిట్రిక్ ... ... | ... | 5 గ్రా॥ మొ. 20 గ్రా॥ |
| ఆసిడ్ హైడ్రోక్లోరిక్ డిల్యూట్ ... | ... | 5 మి॥ మొ. 20 మి॥ |
| ,, హైడ్రోబ్రోమిక్ డిల్యూట్ | ... | 15 మి॥ మొ. 60 మి॥ |
| ,, హైడ్రోసియానిక్ డిల్యూట్ | ... | 2 మి॥ మొ. 6 మి॥ |

### ఇ

| | | |
|---|---|---|
| ఇక్తియాల్ దినమునకు ... | .. | 10 గ్రా॥ మొ. 30 గ్రా॥ |
| ఇన్‌స్లూఃఇన్ ... ... | ... | 10 గ్రా॥ మొ. 20 గ్రా॥ |

### ఈ

| | | |
|---|---|---|
| ఈథర్ సల్ఫ్యూరిక్ రెక్టిఫికేటస్ ... | ... | 40 మి॥ మొ. 60 మి॥ |

### ఓ

| | | |
|---|---|---|
| ఓలియం ఆనిసి ... ... | ... | ½ మి॥ మొ. 3 మి॥ |
| ,, క్లవ్‌జ్ ... ... | ... | ½ మి॥ మొ. 3 మి॥ |
| ,, క్యాస్టర్ ... ... | ... | 1 డ్రా॥ మొ. 8 డ్రా॥ |
| ,, క్యాజిపట్ ... ... | ... | ½ మి॥ మొ. 3 మి॥ |
| ,, కోపేబా ... ... | ... | 5 మి॥ మొ. 20 మి॥ |
| ,, క్రోటన్ ... ... | ... | ½ మి॥ మొ. 1 మి॥ |
| ,, జూనిపర్ ... ... | ... | ½ మి॥ మొ. 3 మి॥ |
| ,, టర్పన్‌టీన్ ... ... | ... | 2 మి॥ మొ. 10 మి॥ |
| ,, నట్‌మెగ్ ... ... | ... | ½ మి॥ మొ. 3 మి॥ |
| ,, పెప్పర్‌మెంట్ ... | ... | ½ మి॥ మొ. 3 మి॥ |
| ,, సాండల్‌వుడ్ (చందనం) ... | ... | 5 మి॥ మొ. 30 మి॥ |

,, సిన్నమస్ ... ... ... ½ మి॥ మొ. 3 మి॥

క

క్యాల్సియం కార్బనస్ ... ... ... 10 గ్రే॥ మొ. 60 గ్రే॥

,, క్లోరిక్ ... ... ... 5 గ్రే॥ మొ. 15 గ్రే॥

,, ఫాస్ఫస్ ... ... ... 5 గ్రే॥ మొ. 15 గ్రే॥

,, సల్ఫైక్ ... ... $\frac{1}{10}$ గ్రే॥ మొ. 1 గ్రే॥

,, హైపోఫాస్ఫిస్ ... ... 3 గ్రే॥ మొ. 10 గ్రే॥

క్వినీన్ ఫాస్ఫస్ ... ... ... 1 గ్రే॥ మొ. 6 గ్రే॥

,, వెలీరియేనా ... ... ... 1 గ్రే॥ మొ. 4 గ్రే॥

,, సల్ఫస్; బలవర్ధ కౌషధము గ ... 1 గ్రే॥ మొ. 5 గ్రే॥

జ్వరమునకు 5 గ్రే॥ మొ. 15 గ్రే॥

,, సాలిసైలస్ ... ... ... 2 గ్రే॥ మొ. 6 గ్రే॥

,, సిట్రస్ ... ... ... 1 గ్రే॥ మొ. 5 గ్రే॥

క్రియసోట్ ... ... ... 1 మి॥ మొ. 5 మి॥

కెఫీన్ ప్యూర్ ... ... ... 1 గ్రే॥ మొ. 3 గ్రే॥

,, సిట్రస్ ... ... ... 2 గ్రే॥ మొ. 10 గ్రే॥

,, వెలీరియేనస్ ... ... ... ½ గ్రే॥ మొ. 3 గ్రే॥

క్రేటా ప్రెపరేటా ... ... ... 10 గ్రే॥ మొ. 60 గ్రే॥

కొడీనా ... ... ... ... ¼ గ్రే॥ మొ. 2 గ్రే॥

కొడీనా ఫాస్ఫస్ ... ... ... ¼ గ్రే॥ మొ. 2 గ్రే॥

క్లోరల్ హైడ్రిస్ ... ... ... 5 గ్రే॥ మొ. 20 గ్రే॥

గ

గ్వాయిపల్ కార్బనస్ (డుయొటాల్) ... 3 గ్రే॥ మొ. 8 గ్రే॥

జ

జింక్ ఆక్సైడ్ ... ... ... 3 గ్రే॥ మొ. 10 గ్రే॥

,, వెలీరియేనస్ ... ... ... 1 గ్రే॥ మొ. 3 గ్రే॥

,, సల్ఫస్; బలవర్ధకౌషధముగ ... 1 గ్రే॥ మొ. 3 గ్రే॥

,, వాంతికారిగ 10 గ్రే మొ. 30 గ్రే॥

## ట

| | |
|---|---|
| టింక్చర్ అసాఫటిడా (ఇంగువ) ... ... | 30 మి॥ మొ. 60 మి॥ |
| ,, అకొనైట్ ... ... ... | 5 మి॥ మొ. 15 మి॥ |
| ,, ,, తఱచుగానిచ్చు నెడల ... | 2 మి॥ మొ. 5 మి॥ |
| ,, ఆరంటి ... ... ... | 30 మి॥ మొ. 60 మి॥ |
| ,, ఆలోజ్; మరల మరల యిచ్చునెడల ... | 30 మి॥ మొ. 60 మి॥ |
| ,, ,, ఒమోతాదు కైన యెడల ... | 1½ డ్రా॥ మొ. 2 డ్రా॥ |
| ,, ఓపియం; మరల మరల యిచ్చునెడల ... | 5 మి॥ మొ. 15 మి॥ |
| ,, ,, ఒకేమోతాదు కైనయెడల ... | 20 మి॥ మొ. 30 మి॥ |
| ,, కలంబా ... ... ... | 30 మి॥ మొ. 60 మి॥ |
| ,, కార్డమం కో॰ ... ... ... | 30 మి॥ మొ. 60 మి॥ |
| ,, కాచు ... ... ... | 30 మి॥ మొ. 60 మి॥ |
| ,, కాల్చికై సెమినం ... ... | 5 మి॥ మొ. 15 మి॥ |
| ,, క్యాంఫర్ కో॰ ... ... ... | 30 మి॥ మొ. 60 మి॥ |
| ,, క్యాప్సికం (మిరచి) ... ... | 5 మి॥ మొ. 15 మి॥ |
| ,, కెనేబిస్ ఇండికా ... ... | 5 మి॥ మొ. 15 మి॥ |
| ,, కెంతారిడీస్ ... ... ... | 5 మి॥ మొ. 15 మి॥ |
| ,, ,, తఱచుగా నిచ్చు నెడల ... | 2 మి॥ మొ. 5 మి॥ |
| ,, క్యూబెబ్ ... ... ... | 30 మి॥ మొ. 60 మి॥ |
| ,, కైనో ... ... ... | 30 మి॥ మొ. 60 మి॥ |
| ,, క్రోని ... ... ... | 30 మి॥ మొ. 60 మి॥ |
| ,, క్వినీన్ ... ... ... | 30 మి॥ మొ. 60 మి॥ |
| ,, క్వినీన్ అమ్మోనియేటా ... ... | 30 మి॥ మొ. 60 మి॥ |
| ,, చైరేటా ... ... ... | 30 మి॥ మొ. 60 మి॥ |
| ,, జాబరాండి ... ... ... | 30 మి॥ మొ. 60 మి॥ |
| ,, జాలప్ ... ... ... | 30 మి॥ మొ. 60 మి॥ |
| టింక్చర్ జింజిబరిస్ ... ... ... | 30 మి॥ మొ. 60 మి॥ |
| ,, జెన్షన్ కో॰ ... ... ... | 30 మి॥ మొ. 60 మి॥ |

టింక్చర్ జెల్సిమియై ... ... ... 5 మి॥ మొ. 15 మి॥
,, డిజిటాలిస్ ... ... ... 5 మి॥ మొ. 15 మి॥
,, నక్సువామికా ... ... ... 5 మి॥ మొ. 15 మి॥
,, ఫెర్రయి పెర్క్లోర్ ... ... 5 మి॥ మొ. 15 మి॥
,, జింజర్ ... ... ... 30 మి॥ మొ. 60 మి॥
,, భవాచీ ... ... ... 30 మి॥ మొ. 2 డ్రా॥
,, బెలడోనా ... ... ... 5 మి॥ మొ. 15 మి॥
,, బెంజాయిన్ కో ... ... 30 మి॥ మొ. 60 మి॥
,, మిర్ ... ... ... 30 మి॥ మొ. 60 మి॥
,, యెర్గోటా అమ్మోనియేటా ... ... 30 మి॥ మొ. 60 మి॥
,, యూనమిన్ ... ... ... 10 మి॥ మొ. 40 మి॥
,, రీయై కో; మరల మరల యిచ్చునెడల ... 30 మి॥ మొ. 60 మి;
,, ,, ఒకే మోతాదుకైనచో ... 2 డ్రా॥ మొ. 4 డ్రా॥
,, లాబేలియా ఈథరిస్ ... ... 5 మి॥ మొ. 15 మి॥
,, సింకోనా ... ... ... 30 మి॥ మొ. 60 మి॥
,, సింకోనా కో ... ... ... 30 మి॥ మొ. 60 మి॥
,, సిన్నమన్ ... ... ... 30 మి॥ మొ. 60 మి॥
,, సెనిగా ... ... ... 30 మి॥ మొ. 60 మి॥
,, సెన్నా కో; మరల మరల యిచ్చునెడల ... 30 మి॥ మొ. 60 మి;
,, ,, ఒకే మోతాదుకైనచో ... 2 డ్రా॥ మొ. 4 డ్రా॥
,, స్ట్రమోనియం ... ... ... 5 మి॥ మొ. 15 మి॥
,, స్ట్రొఫాంతస్ ... ... ... 5 మి॥ మొ. 15 మి॥
,, హాయొసామి ... ... ... 30 మి॥ మొ. 60 మి॥
,, హామామలీస్ ... ... ... 30 మి॥ మొ. 60 మి॥
,, హైడ్రాస్టిస్ ... ... ... 30 మి॥ మొ. 60 మి॥

డ

డయూరెటిన్ ... ... ... 5 గ్రె॥ మొ. 15 గ్రె॥

త

తైమాల్ ... ... ... ½ గ్రె॥ మొ. 2 గ్రె॥

## ప

| | | |
|---|---|---|
| పల్విస్ అంటిమోనియాలిస్ ... ... | 3 గ్రా॥ మొ. | 6 గ్రా॥ |
| ,, ఇపికాక్ కో ... ... ... | 5 గ్రా॥ మొ. | 15 గ్రా॥ |
| ,, క్రేటా ఆరోమేటిక్ ... ... | 10 గ్రా॥ మొ. | 60 గ్రా॥ |
| ,, క్రేటా అరోమేటిక్ కం ఓపియం ... | 10 గ్రా॥ మొ. | 40 గ్రా॥ |
| ,, కైనో కో ... ... ... | 5 గ్రా॥ మొ. | 15 గ్రా॥ |
| ,, జాలప్ కో ... ... ... | 20 గ్రా॥ మొ. | 60 గ్రా॥ |
| ,, క్రైస్రె; మరల మరల నిచ్చుటకు ... | 3 గ్రా॥ మొ. | 10 గ్రా॥ |
| ,, ,, ఒకే మోతాదుకైనచో ... | 15 గ్రా॥ మొ. | 30 గ్రా॥ |
| ,, క్రైయె కో ... ... ... | 20 గ్రా॥ మొ. | 60 గ్రా॥ |
| ప్లంబ్ ఆసిటస్ (ప్యూర్) ... ... | 1 గ్రా॥ మొ. | 5 గ్రా॥ |
| పిల్యూలా ఆలోజ్ యెట్ అసాఫటిడా ... | 4 గ్రా॥ మొ. | 8 గ్రా॥ |
| ,, ,, ఫెర్రియి ... ... | 4 గ్రా॥ మొ. | 8 గ్రా॥ |
| ,, ,, మిర్ ... ... | 4 గ్రా॥ మొ. | 8 గ్రా॥ |
| ,, ఇపికాక్ కం సిల్లా ... ... | 4 గ్రా॥ మొ. | 8 గ్రా॥ |
| ,, కాలోసింత్ కో ... ... | 4 గ్రా॥ మొ. | 8 గ్రా॥ |
| ,, ఫాస్ ఫరస్ ... ... | 1 గ్రా॥ మొ. | 2 గ్రా॥ |
| ,, క్రైయె కో ... ... ... | 4 గ్రా॥ మొ. | 8 గ్రా॥ |
| ,, హైడ్రార్ జరై (బ్లూపిల్) ... | 4 గ్రా॥ మొ. | 8 గ్రా॥ |
| పెప్సిన్ పోర్సి ... ... ... | 5 గ్రా॥ మొ. | 10 గ్రా॥ |
| పైపరజీన్ .. ... ... | 4 గ్రా॥ మొ. | 10 గ్రా॥ |
| పొటాస్ అయొడైడ్ ... ... ... | 5 గ్రా॥ మొ. | 20 గ్రా॥ |
| ,, ఆసిటస్ ... ... ... | 10 గ్రా॥ మొ. | 60 గ్రా॥ |
| ,, కార్బనేట్ ... ... ... | 5 గ్రా॥ మొ. | 20 గ్రా॥ |
| ,, క్లోరస్ ... ... ... | 5 గ్రా॥ మొ. | 15 గ్రా॥ |
| ,, టార్ట్రస్ ... ... ... | 20 గ్రా॥ మొ. | 60 గ్రా॥ |
| పొటాస్ నైట్రస్ ... ... ... | 5 గ్రా॥ మొ. | 20 గ్రా॥ |
| ,, పర్మాంగనేట్ ... ... ... | 1 గ్రా॥ మొ. | 3 గ్రా॥ |
| ,, బైకార్బనస్ ... ... ... | 5 గ్రా॥ మొ. | 30 గ్రా॥ |
| ,, బైక్రోమస్ ... ... ... | $\frac{1}{10}$ గ్రా॥ మొ. | $\frac{1}{5}$ గ్రా॥ |

| | | |
|---|---|---|
| పొటాస్ బ్రొమైడ్ ... ... ... | 5 గ్రా॥ మొ. | 30 గ్రా॥ |
| ,, సల్ఫస్ ... ... ... | 10 గ్రా॥ మొ. | 40 గ్రా॥ |
| ,, సిట్రస్ ... ... ... | 10 గ్రా॥ మొ. | 40 గ్రా॥ |

ఫ

| | | |
|---|---|---|
| ఫెర్రియి అయొడైడ్ ... ... ... | 1 గ్రా॥ మొ. | 5 గ్రా॥ |
| ,, ఆర్సెనిక్ ... ... ... | $\frac{1}{16}$ గ్రా॥ మొ. | $\frac{1}{4}$ గ్రా॥ |
| ,, కార్బనస్ సాకరేటా ... ... | 10 గ్రా॥ మొ. | 30 గ్రా॥ |
| ,, టార్టరేటం ... ... ... | 5 గ్రా॥ మొ. | 10 గ్రా॥ |
| ,, ఫాస్ఫస్ ... ... ... | 5 గ్రా॥ మొ. | 10 గ్రా॥ |
| ,, యెట్ క్వినీన్ సిట్రస్ ... ... | 5 గ్రా॥ మొ. | 10 గ్రా॥ |
| ,, యెట్ అమ్మోనియా సిట్రస్ !... | 5 గ్రా॥ మొ. | 10 గ్రా॥ |
| ,, ఏట్రిస్ ... ... ... | 5 గ్రా॥ మొ. | 10 గ్రా॥ |
| ,, రెడాక్టం ... ... ... | 1 గ్రా॥ మొ. | 5 గ్రా॥ |
| ఫెనకాల్ హైడ్రోక్లోర్ ... ... | 7 గ్రా॥ మొ. | 15 గ్రా॥ |
| ఫెనాసిటిన్ ... ... ... | 5 గ్రా॥ మొ. | 10 గ్రా॥ |

బ

| | | |
|---|---|---|
| బాల్సమం కోపేబా ... ... ... | 30 మినుములు. | |
| బిస్మత్ కార్బనస్ ... ... ... | 5 గ్రా॥ మొ. | 20 గ్రా॥ |
| ,, సబ్ నైట్రస్ ... ... ... | 5 గ్రా॥ మొ. | 20 గ్రా॥ |
| ,, సేలిసైలస్ ... ... ... | 5 గ్రా॥ మొ. | 20 గ్రా॥ |

య

| | | |
|---|---|---|
| యక్స్ట్రాక్టు ఆలెట్రిస్ లిక్విడ్ ... ... | 10 మి॥ మొ. | 30 మి॥ |
| ,, ఆలోజ్ బార్బడెన్సిస్ ... ... | 2 గ్రా॥ మొ. | 4 గ్రా॥ |
| ,, ఇపికాక్ లిక్విడ్ ..కఫహారిగ ... | ½ మి॥ మొ. | 2 మి; |
| ,, ,, వాంతికారిగ ... | 15 మి॥ మొ. | 20 మి॥ |
| ,, యెర్గోటా లిక్విడ్ ... ... | 15 మి॥ మొ. | 30 మి॥ |
| ,, ఓపియం (సాలిడ్) ... ... | ¼ గ్రా॥ మొ. | 1 గ్రా॥ |
| ,, ఓపియం (లిక్విడ్) ... ... | 5 మి॥ మొ. | 30 మి॥ |
| ,, కాస్కారా సాగ్రాడా (సాలిడ్) ... | 2 గ్రా॥ మొ. | 8 గ్రా॥ |
| ,, కాస్కారా సాగ్రాడా (లిక్విడ్) ... | 30 మి॥ మొ. | 60 మి॥ |

| | |
|---|---|
| యక్స్ట్రాక్టం కాల్చికం ... ... ... | ¼ గ్రా॥ మొ. 1 గ్రా॥ |
| ,, కాలొసింత్ కో ... ... | 2 గ్రా॥ మొ. 8 గ్రా॥ |
| ,, కావ కావా ... ... ... | 30 మి॥ మొ. 60 మి॥ |
| ,, కెనెబిస్ ఇండికా ... ... | ¼ గ్రా॥ మొ. 1 గ్రా॥ |
| ,, కోకా (సాలిడ్) ... ... | 2 గ్రా॥ మొ. 15 గ్రా॥ |
| ,, కోకా (లిక్విడ్) ... ... ... | 30 మి॥ మొ. 60 మి॥ |
| ,, కోని (లిక్విడ్) ... ... ... | 5 మి॥ మొ. 15 మి॥ |
| ,, కోటో (లిక్విడ్) ... ...<br>,, నీళ్లలో కలువదు | 2 మి॥ మొ. 6 మి॥ |
| ,, కోలా ... ... ... | 10 మి॥ మొ. 20 మి॥ |
| ,, గ్రిండేలియా రోబస్ట్ లిక్విడ్ ... ... | 10 మి॥ మొ. 20 మి॥ |
| ,, జన్షన్ ... ... ... | 2 గ్రా॥ మొ. 8 గ్రా॥ |
| ,, జాబరాండీ (లిక్విడ్) ... ... | 5 మి॥ మొ. 15 మి॥ |
| ,, జాంబులీన్ .. ... ... | ½ డ్రా॥ మొ. 2 డ్రా॥ |
| ,, డామియానా (లిక్విడ్) ... ... | 1 డ్రా॥ మొ. 2 డ్రా॥ |
| ,, నక్సువామికా (సాలిడ్) ... ... | ¼ గ్రా॥ మొ. 1 గ్రా॥ |
| ,, నక్సువామికా (లిక్విడ్) ... ... | 1 మి॥ మొ. 3 మి॥ |
| ,, బెలడోనా (సాలిడ్) ... ... | ¼ గ్రా॥ మొ. 1 గ్రా॥ |
| ,, బేల (లిక్విడ్) ... ... | 1 డ్రా॥ మొ. 2 డ్రా॥ |
| ,, రీయై ... ... ... | 2 గ్రా॥ మొ. 8 గ్రా॥ |
| ,, వైబర్నం ప్రూని ఫోలియో (లిక్విడ్) ... | 1 డ్రా॥ మొ. 2 డ్రా॥ |
| ,, సార్సా (లిక్విడ్) ... ... | 2 డ్రా॥ మొ. 4 డ్రా॥ |
| ,, సింకోనా (లిక్విడ్) ... ... | 5 మి॥ మొ. 15 మి॥ |
| ,, సెన్నా (లిక్విడ్) ... బిడ్డలకు ... | ½ డ్రా॥ మొ. 1 డ్రా॥ |
| ,, ,, పెద్దలకు ... | 1 డ్రా॥ మొ. 2 డ్రా॥ |
| ,, స్ట్రిమోనియం ... ... | ¼ గ్రా॥ మొ. 1 గ్రా॥ |
| ,, హమామలిస్ (లిక్విడ్) ... ... | 5 మి॥ మొ. 15 మి॥ |
| ,, హయొసామి ... ... | 2 గ్రా॥ మొ. 8 గ్రా॥ |
| ,, హైడ్రాస్టిస్ (లిక్విడ్) ... ... | 5 మి॥ మొ. 15 మి॥ |
| యాక్వినీన్ ... ... ... | 3 గ్రా॥ మొ. 15 గ్రా॥ |

యురాసమిన్ ... ... ... 5 గ్రే॥ మొ. 15 గ్రే॥

యురేని నైట్రిస్ ... ... ½ గ్రే॥ మొ. 5 గ్రే॥

ర

రిసార్సిన్ ... ... ... 3 గ్రే॥ మొ. 8 గ్రే॥

ల

లిథియా కార్బనస్ ... ... ... 2 గ్రే॥ మొ. 6 గ్రే॥

,, బెంజోయస్ ... ... ... 10 గ్రే॥ మొ. 30 గ్రే॥

,, బ్రోమైడ్ ... ... ... 5 గ్రే॥ మొ. 15 గ్రే॥

,, సిట్రిస్ ... ... ... 5 గ్రే॥ మొ. 10 గ్రే॥

లైకర్ అమ్మోనియా ... ... ... 10 మి॥ మొ. 20 మి॥

,, అమ్మోనియా ఫార్ టే ... ... 3 మి॥ మొ. 6 మి॥

,, ఆర్సెనికాలిస్ ... ... ... 2 మి॥ మొ. 8 మి॥

,, ఆర్సెనియై యెట్ హైడ్రార్జరై ఆయొడైడ్ 5 మి॥ మొ. 20 మి॥

,, బిస్మత్ యెట్ అమ్మోనియా సిట్రిటిస్ ... 30 మి॥ మొ. 60 మి॥

,, పొటాష్ ... 10 మి॥ మొ. 30 మి॥ విరివిగా నీటిలోగలిపి;

,, సాంటాల్ ఫ్లేవి బకుక్కు యెట్ క్యూబెబ్ 1 డ్రా॥ మొ. 2 డ్రా॥

,, సోడా ఆర్సెనికాలిస్ ... ... 2 మి॥ మొ. 8 మి॥

,, స్ట్రిక్ నిన్ హైడ్రోక్లోర్ ... ... 2 మి॥ మొ. 8 మి॥

,, హైడ్రార్జరై పెర్ క్లోర్ ... ... 30 మి॥ మొ. 60 మి॥

వ

వైనం ఆంటిమోనియాలిస్ ... ... 10 మి॥ మొ. 30 మి॥

,, వాంతికారిగ ... 2 డ్రా॥ మొ. 4 డ్రా॥

,, ఇపికాక్ కఫహారిగ ... ... 10 మి॥ మొ. 30 మి॥

,, ,, వాంతికారిగ ... 4 డ్రా॥ మొ. 6 డ్రా॥

,, క్వైనీన్ ... ... ... 30 మి॥ మొ. 60 మి॥

,, కాల్చికం ... ... ... 10 మి॥ మొ. 30 మి॥

,, పెప్సిన్ ... 1 డ్రా॥ మొ. 2 డ్రా॥ భోజనముతోగూడ.

,, ఫెర్రయి ... ... ... 1 డ్రా॥ మొ. 4 డ్రా॥

,, ఫెర్రయి సిట్రస్ ... ... 1 డ్రా॥ మొ. 4 డ్రా॥

స

సల్ఫొనల్ ... ... ... 10 గ్రా॥ మొ. 30 గ్రా॥

సాలిసైనం ... ... ... 5 గ్రా॥ మొ. 20 గ్రా॥

సాలోల్ ... ... ... 5 గ్రా॥ మొ. 15 గ్రా॥

సాంటొనీన్ ... ... ... 2 గ్రా॥ మొ. 5 గ్రా॥

సిరప్ ఫెర్రయి అయొడైడ్ ... ... 30 మి॥ మొ. 60 మి॥

స్పిరిటుస్ అమ్మోనియా ఆరోమేటిక్ ; మరల మరల నిచ్చుటకు 20 మి॥ మొ. 40 మి॥

డిటో. ఒకేమోతాదుగ నైనచో 60 మి॥ మొ. 90 మి॥

,, ఈథరిస్ ... ... పైప్రకారమే.

,, ఈథరిస్ కో ... పైప్రకారమే.

,, ఈథర్ నైట్రస్ ... పైప్రకారమే.

,, క్లోరోఫారం ... మరల మరల నిచ్చుటకు 5 మి॥ మొ. 20 మి॥

డిటో. ఒకే మోతాదుగ 30 మి॥ మొ. 40 మి॥

,, జూనిపర్ ... ... ... 20 మి॥ మొ. 60 మి॥

,, లావండ్యూలా ... ... ... 5 మి॥ మొ. 20 మి॥

హా

హైడ్రార్జరై కం క్రేటా ... ... ... 1 గ్రా॥ మొ. 5 గ్రా॥

,, పెర్ క్లోరిడ్ ... ... ... $\frac{1}{32}$ గ్రా॥ మొ. $\frac{1}{16}$ గ్రా॥

,, సబ్ క్లోరిడ్ ... ... ... $\frac{1}{2}$ గ్రా॥ మొ. 5 గ్రా॥



# అభిప్రాయములు.



ఆయుర్వేద మార్తాండ భిషగ్మణి పండిత డి. గోపాలాచార్యుల వారీ గ్రంథమునుగూర్చి యిట్లువ్రాయుచున్నారు.

“మనభారతీయులు కొద్దికాలమునుండి ప్రాచీననవీన శాస్త్రీయమగు గ్రంథములను ఆయాదేశ భాషలలోనికి, పామరజనసామాన్యమునకు గూడ దెలియునటుల తర్జుమాలనుజేసి, ప్రాకృతభాష నభివృద్ధికిం దెచ్చుచున్నారు.

అటులనే ఆంధ్రభాషా యోషామణినిగూడ, నిక్కాలపు నవీనశాస్త్రములచే నభివృద్ధిని బొందుపరుప మార్గదాయకులయిన రాయబహద్దూరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు మొదలగు వారలకును, శ్రీవిజ్ఞాన చంద్రికాగ్రంథమాలా మండలి వారలకును, ఆంధ్రజనసామాన్యము కృతజ్ఞులై యుండవలయును. పైవారలవలెనే యనేక ఆంధ్రమహనీయులు, అనేకగ్రంథముల, సంస్కృత, ఆంగ్లేయ, గ్రంథములనుండి దెనిగించినను ఆంగ్లేయ వైద్యగ్రంథములు లెక్కకు గొన్నిమాత్రమే కనబడుచున్నవి.

అట్టిలోపమును దొలగింప నీ గ్రంథకర్తగారు ఆంగ్లేయ చికిత్సా గ్రంథములు పెక్కులు చదివి, వానిసారమును జక్కగ గ్రహించి, ఒక భాషనుండెడి విషయమును మరియొకభాషకు మార్చునపుడు గలిగెడు కష్టములను ఎంతమాత్రమునులేక, అందలి సారమునంతయు చక్కని తేట తెలుగున ఆంధ్రప్రపంచముయొక్క ఉపయోగమునకై ఆంగ్లేయ చికిత్సా సారభూత మనబరంగు ఆంగ్లేయ వైద్యచింతామణి యనుపేర ముద్రించిన గ్రంథము మిక్కిలి యుపయోగకరమైనటుల దెలిసికొంటిని.

ఈగ్రంథమందు అకారాదిరూపమున వ్యాధులవిరమును, అందుకుదగు చికిత్సలను, ఏర్పరచుటయేగాక, నాడి, మూత్రము మొదలగువాటి పరీక్షలును, మందుల, తూనికల, నియమములును, జక్కగ నేర్పాటుచేయబడియున్నవి.

ఇట్టిగ్రంథము సామాన్యవైద్యులకు మిగుల మేలుచేయును. ప్రతికుటుంబమునను నుండదగినదని నొక్కి చెప్పగలను.

మరియు, ఈగ్రంథకర్తగారి గ్రంథరచనా సామర్థ్యముచూడ, నిటులనే ఆంగ్లేయ వైద్యశాస్త్రమునందలి యనేక విషయములను చిన్నచిన్న పొత్తములుగ

నాంధ్రభాషను రచింపవలెనని నెవ్వుడు ప్రార్థించెదను"

చెన్నపురిలోని డాక్టర్ ఆచంట లక్ష్మీపతి బి. యే. యం. బి. అండ్ సి. యం. గారిట్లువ్రాయుచున్నారు:—

"ఈ గ్రంథమునం దనేక విషయములు మిక్కిలి వివరముగ వ్రాయబడినవి. ఆంగ్లేయ వైద్యసారమును ప్రజలయెదుటబెట్టి మనదేశపు ప్రజల యంధకారమును బాపు గ్రంథములలో నిది మొదటిదియని జెప్పవచ్చును.

తెలుగుదేశమునందలి ప్రజలందరును దీనినిజదివి గ్రంథకర్తగారి యెడల కృతజ్ఞులగుదురు గావుత!"

డాక్టర్ డి. యస్. రామచంద్రరావు యం. యే. యం. బి సియచ్. బి. గారు క్రింది విధముగ వ్రాసియున్నారు.

" ఆంగ్లేయ వైద్యచింతామణి యను గ్రంధము ఆంధ్రమహాజనుల వలన ఆదరింపబడునని నేను నమ్ముచున్నాను. ఈ గ్రంథము, వ్యాధియొక్క చికిత్స విషయమును, యిరోపియను వైద్యక్రమమును, బోధించుచున్నది. వైద్యేతరులు, వ్యాధులయొక్క సాధారణ గతులయందు, తమను తమ కుటుంబములను, జికిత్సజేసి కొనుటకై, ఈ గ్రింథముపయోగింప గలదు."

మచిలీపట్నము నందలి డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య బి. యే. యం. బి. అండ్ సి. యం. గారు కీర్తికయం దీ క్రింది విధముగ నుడివిరి:—

"గ్రింథకర్త గారెంతయు వ్యయ ప్రయాసముల కోర్చి, ఈ గ్రంథ పూర్వకముగ నాంగ్లేయ వైద్యశాస్త్రి సారము నాంధ్రుల కందజేసి వారి కృతజ్ఞతకు బాత్రులయిరి."

తెనాలిలో సివిలు సర్జనుగా నున్న ఉ. సీతారామస్వామి నాయుడు యల్. యమ్. అండ్ యస్. గారిట్లు వ్రాయుచున్నారు.

"ఆంగ్లేయ వైద్య చింతామణి యను గ్రంథములోని కొన్ని భాగములను జదివి, దానిని మిగుల యుపయోగమగు పుస్తకముగా గనుకొంటిని. ఆంగ్లేయ భాషయందలి మూర్సు మ్యాన్యుయల్ వలె, నిదియు నాంధ్రుల యందు త్వరలో వాడుక లోనికి రాగలదని నాకు నమ్మకము కలదు."

## ఆంధ్రపత్రిక.

బొంబాయిలోని ఆంధ్రపత్రిక యిట్లువ్రాయుచున్నది.

" ఆంధ్రభాష హిందూ దేశభాషలలో ద్వితీయ స్థానమును, దక్షిణహిందూస్థానభాషలలో మొదటిచోటును అలంకరించుచున్నది. తెలుగుభాష రెండు కోట్ల జనులచే మాట్లాడ బడుచున్నను దేశీయుల యాదరణము లేమింజేసి, దానియందు విద్యాభి వృద్ధికి దగిన గ్రంథములు ముద్రింపబడుట లేదు. శాస్త్రీయ గ్రంథములు జ్ఞానాభివృద్ధిజేసి దేశ పురోవృద్ధికి దోడ్పడు చున్నవి గాన, నిట్టి గ్రంథముల రచియించు మహాజను లాంధ్రలోక కృతజ్ఞతకు బాత్రులగు చున్నారు.

ప్రపంచమునందు వైద్యము నెరుగని వారును సంగీతము రానివారును నుండరను జనోక్తి యందరకును దెలిసి యున్నది. శరీరమునకు వ్యాధులు సహజములు. వాటి నివారణకయి ప్రతి మనుజుడును దనకు దోచిన ప్రతిక్రియను జేయును. ఈ యనుభవ సమ్మేళనమే వైద్యశాస్త్రముగ బరిణమించుచున్నది. పూర్వము హిందువులు వస్తుగుణమును రోగ లక్షణములను బాగుగ గనిపెట్టి ఆయుర్వేదవిద్యను వ్యాపన చేసిరి. వైద్యమునకు బ్రయోగ యోగ్యమయిన శాస్త్రజ్ఞానము ముఖ్యము. ఆయుర్వేద వైద్యము క్షీణించుట వలన దేశీయవైద్య మిపుడు కష్టతరముగ నున్నది. వస్తుసమూహము దొరకుట దుర్లభము. వైద్యుడు వాడదలచిన వస్తువును దాను స్వయముగ సిద్ధము చేసికొనవలయును. రసాయన శాస్త్రాభి వృద్ధివలన గనిపెట్టబడి కొద్దివెలకు జిక్కుచున్న వస్తువులను వాడుటకు వీలులేదు. కార్బాలిక్ ఆసెడ్, క్వినీన్, ఎప్సంసాల్టు మొదలగు సామాన్యపు వస్తువుల వాడుక నయితము దెలియదు. ఆంగ్లేయవైద్యము శాస్త్రసమ్మతమై ప్రయోగ యోగ్యముగ నున్నది. ఈశాస్త్రమునందు వస్తుగుణము, వస్తుతత్వము, వస్తుప్రయోగము, వస్తువు భిన్నావయవముల విూద జేయు పని, వానివలన గలుగు మార్పు, ప్రమాణాధారమును బట్టి సవిస్తరముగ వ్రాయబడినవి. జ్ఞాన మహర్నిశము వృద్ధిజెందుచున్నది. రసాయన శాస్త్ర సహాయమున గ్రొత్తమందు లెన్నియో జేయబడు చున్నవి. అవి సులభముగ లభించుచున్నవి. కాన వైద్యమునందు బ్రవేశము గలవారలును సామాన్యులును నాంగ్లేయ వైద్య జ్ఞానమును గొంత గలిగియుండుట మంచిది.

ఈకొఱతను దీర్చుటకై ఆంగ్లేయ వైద్య చింతామణి మిగుల నుపకారిగ నుండును. శాస్త్రీయ గ్రంథమును భాషాంతరీకరించుట కష్టతరము. నూతన వైద్య

పరిభాష దేశభాషలయందు లేనందున మరింత కష్టము. అట్టి సందర్భములో వ్యయ ప్రయాసములకోర్చి రచియించిన యీ గ్రంథ మాంధ్రులచే నాదరింపదగి యున్నది. గ్రంథముల గొనుటవలన గ్రంథకర్తలకు ప్రోత్సాహములు గలిగి, దేశ భాషా వృక్షము శాఖోపశాఖలతో వర్ధిల్లగలదు. ఈ గ్రంథము యొక్క యుప యోగ మీ క్రింది విషయముల వలన బోధపడగలదు.

అజీర్ణము, అతిమూత్రము, అతిసారము, ధనుర్వాతము, ఉబ్బసము, కసుమ వ్యాధులు, గజ్జి, కడుపు నొప్పి, చెవి పోటు, కలరా, చంటిబిడ్డ రోగము, రాచ పుండు, కుష్ఠ రోగము, కొరకు, సెగ రోగము, గర్భస్రావము, పక్షవాయువు, వాయువు పోట్లు, చీడ, జ్వరము, చలిజ్వరము, విషమజ్వరము, టైఫాయడ్, ప్లేగ్, తలనొప్పి, దగ్గు, నంజు, నపుంసకత్వము, నిస్సత్తువ, నేత్రరోగములు, పచ్చకామాల, పంటిజబ్బులు, పాముకాటు, పుండ్లు, బొల్లి, మలబంధము, మూత్ర రోగములు, మూర్ఛలు, మూలశంక, వాతరోగము, వాంతులు, శ్వాసకోసలు, శూలనొప్పి, వెఱ్ఱి, వీర్యనష్టము, విస్మృతి, మొదలగు రోగలక్షణములును, వాటికి చేయవలసిన చికిత్సలును, తేటతెలుగు మాటల వ్రాయబడినవి. దీనియందు పిండో త్పత్తిక్రమమును, జీర్ణకోశమును, ఉదరభాగములను, దెలుపు చిత్రపటములు ముద్రింపబడినవి. ప్రసిద్ధికెక్కిన వస్తుసంపుటి ప్రక్రియలు చాలగ నుదహరింప బడి నవి. నాడిని, నాలుకను, ఊపిరి తిత్తులను, మొదలగు అవయవముల బరీక్షించి వ్యాధిని గనిపెట్టు విధము దెలుపబడినది. మూత్రపరీక్షను జేయు పద్ధతియు దెలుప బడినది. న్యూమోనియా, టయిఫాయడ్ జ్వరము మొదలగు వాటిని గుఱించి వ్రాయబడినది.''

---

## ఆ కా శ వా ణి ప త్రి క .

రాజమహేంద్రవరములోని ఆకాశవాణి పత్రిక యిట్లువ్రా యుచున్నది:—

సమస్త ప్రకృతి శాస్త్రములను హిందువులు తమపరిశ్రమచే దెలిసికొనియుండిరి. అందులో అయుర్వేదముగూడ మనపూర్వులచే పూర్ణముగ నభ్యసింప బడినటుల లోకవిదితము. వైద్యశాస్త్రములను నిర్మించుటకు బ్రహ్మ మొట్టమొదటివాడని మన సాంప్రదాయము. ఈవైద్యశాస్త్రము మాతృభాషయగు సంస్కృతభాషలో లిఖియింప

బడి యుండుటచే వివిధభాషలకు వాసస్థానమగు మనదేశమందు మాతృభాష నెరిగి నవారిలో వేయింటికొకడు మాత్రమే ఆయుర్వేద జ్ఞానము గలిగినవాడై, తదితరులు భాషాపరిజ్ఞానలేమిచే ఆయుర్వేద విద్యను వ్యాపింప నసమర్థులైరి. మనయాంధ్రభాష మనదేశభాషలలో రెండవదిగా పరిగణింపబడుచున్నది. ద్వితీయ స్థానము నలంకరించిన నాంధ్రభాషయందు వివిధశాస్త్రీయగ్రంథములను వెల్లడించి దేశపురోవృద్ధికి మార్గము జూపిన నాంధ్రగ్రంథకర్తలు మనయాంధ్రులచే వేయినోళ్లపొగడబడదగిన వారు. ప్రతిమనుజునకు వైద్యశాస్త్రముయొక్క యావశ్యకతయిట్టిదని వర్ణింప ననవసరము. సకలమూలికలకు, వివిధవస్తువులకు, నాకరంబైన దివ్యావనంబులు గలిగిన భరతఖండమందు వైద్యమునకై పాశ్చాత్యుల పాలబడవలసి వచ్చినది; పశ్చిమవాసుల వైద్యశాస్త్రము అన్యభాషయందుండుటచే, మనవారు దానినైన గ్రహింప నసమర్థులైరి. ఇంగ్లీషువైద్యశాస్త్రము తర్జుమాజేయబడి ఆంధ్రుల కొరంత దీర్చినందులకు ఆంగ్లేయ వైద్య చింతామణి గ్రంథకర్తలగు మ॥ రా॥ సి. సేతుమాధవరావు గారి యెడల మనమందరము కృతజ్ఞులై యుండవలసినది.

శాస్త్రగ్రంథములను భాషాంతరీకరించుటయందలి కష్టము వేరుగానిట వ్రాయ నక్కరలేదు. అందులో పరభాషయందలి శాస్త్రమును భాషాంతరీకరించుట కష్టతమము. వ్రియప్రయాసములకు లోనై ఉపయోగకరముగ తేటతెలుగులో వ్రాయబడిన నీగ్రంథము నాంధ్రులందరిచే నాదరింపబడదగినది. ఈగ్రంథమునందలి చికిత్సలనేక యనుభవశీలురగు డాక్టర్లచే నామోదింపబడినవి.

ఇందు సకలరోగలక్షణములు, వాటికితగు చికిత్సలు వ్రాయబడినవి. దీనియందు గర్భిణీస్త్రీలక్రమము, శరీరములోని వివిధావయవములయొక్క చిత్రపటములు, రంగులతో ముద్రింపబడినవి. అవయవములను కనిపెట్టి రోగమిట్టిదని గ్రహింప సామర్థ్యము గలుగచేయు, లక్షణములిందు నిరూపింపబడినవి. మూత్రపరీక్షను జేయువిధి ఈగ్రంథమందు చక్కగ జెప్పబడెను. వేయేల! ఈరోగమారోగ మనక మనుష్యసామాన్యమందరకు వచ్చురోగములు, అట్టిరోగముల యుత్పత్తి, వాటిచికిత్స, ఈఆంధ్రవైద్యగ్రంథరాజమందు విపులముగ లిఖియింపబడినవి.''

---

మాడపాటి వెంకటేశ్వరరావు పంతులుగారు:—రిటైర్డు దివాన్, ఉయ్యూరు యెస్టేట్, యక్స్ దివాన్ నిడదవోలు సమస్థానము, జమీందార్ రంగాపురం యెస్టేట్— ... ఆంగ్లేయ వైద్య చింతామణియను గ్రంథమును బహు కుతూహలముతో జదివితిని. ఇట్టి గ్రంథమొకటి ఉండవలసి యుండెనని నేను చిరకాలము

నుంచి అనుకొనుచున్నందుకు ఆ కొఱతను మీరు తీర్చుటవలన మీకు వందనములు చేయుటయేగాక, దానిని జదివిన బ్రతివారికిని, మీ వలన గలిగిన లాభమునకు మీరు వంద నీయులై యుందురని కూడ చెప్పగలను.”

ఉప్పులూరి మండయ్యాశాస్త్రి గారు, నేటివుడాక్టరు, జగన్నాథపురము, కాకినాడ:— “ఆంగ్లేయ వైద్య చింతామణి యను గ్రంథమును సాంతముగా జదివి మిగుల మనోహరముగ నున్నట్లు కనుగొంటిని. వివిధ వ్యాధులయొక్క నిదానమును సాధ్య మైనంతవరకు పూర్ణముగ వివరింపబడియున్నది.”

సుకల్ కుంజి బిహారిలాల్ గారు, నేటివుడాక్టరు, గొల్లలమామిడాడ:— “ఆంగ్లేయ వైద్య చింతామణియను గ్రంథమును మిక్కిలి ఆసక్తితో జదివియుంటిని. ఆంగ్లేయ వైద్య గ్రంథముల బరిశీలించి అందుండు రోగనిదానములు, చికిత్సలు, తెలుగు భాషలోనికి తర్జుమా చేయబడి ప్రచురింపబడిన గ్రంథములలో నిదియే మొదటి గ్రంథమని, యదార్థమును యిందుమూలముగా దెలియ జేయుచున్నాను. మీరిందు విషయమై పడిన శ్రమను, భాషాభిమానులగు దేశీయ వైద్యులును, తదితరులును, మరువకుందురని తలంచెదను.”

బి. కొండారెడ్డిగారు, నేటివుడాక్టరు, ఉమ్మలదేవం, కడపజిల్లా :—“... తాముపంపిన ఆంగ్లేయ వైద్యచింతామణి యను గ్రంథమును ఎంత ప్రయాసతో రచియించితిరో, మాబోటిపల్లెటూరి బీదవైద్యులకు నిండా ఉపయోగముగానున్నది. ఇందునుగురించి తమను శ్లాఘింప మేమెంతటివారము.”

కొత్తపల్లి నరసింహంగారు, పాలమూరు:— “... ఇంతమంచిగ్రంథమును తెలుగులో నిదివరకెవ్వరును బ్రకటించలేదు. కాని, యింకను గొన్ని స్వల్పసంగతులు యీపుస్తకములో నిమిడియున్నయెడల, ఈపుస్తకము ఖరీదు యింతకంటె రెట్టింపుచేసినను అనేకులు కొనగలరు.”

సురభి వెంకయ్యగారు, వేక్సైను డిపార్టుమెంటు, కాకినాడ:— “ఆంగ్లేయ వైద్యచింతామణి తెలుగునంగల ఆంగ్లేయవైద్య గ్రంథములలో నిరూపమానముగా నున్నదని చెప్పగలను. ఈగ్రంథము మిక్కిలి సులభ శైలిని, విపులముగా వ్రాయబడినది. ఇంగ్లిషుజ్ఞానము లేనివారైనను ఈగ్రంథమును జదివి, ఇంగ్లీషు వైద్యశాస్త్రజ్ఞానమును గొంతవఱకు సులభముగా గ్రహింపవచ్చును. ఈగ్రంథమును బ్రచురించుటవలన, సేతుబ్రదర్సువారు చేసిన మహోపకారమునకు ఆంధ్రదేశీయులు వారియెడ కృతజ్ఞత గలవారగుదురని నేను నమ్ముచున్నాను.”

డి. కృష్ణమూర్తిగారు, నేటివ్‌డాక్టరు, మండపేట:— "మీరురచియించిన ఆంగ్లేయవైద్యచింతామణియను గ్రంథమును నేనుదెప్పించి సాంతముగా జూచినాను. తెలుగు భాషలో నిట్టిగ్రంథ మిదివరకు ప్రచురింప బడలేదు."

కారుపర్తి బ్రహ్మానందయ్యగారు, మోరి, నగరంతాలూకా, గోదావరిజిల్లా:— "ఆంధ్రజనుల కమితోప యోగకరమై యున్నది. ఇందులకుతమ యెడ కృతజ్ఞులమై యుండగలము."

పా. వెంకటాచార్యులవారు, ఆయుర్వేదాశ్రమం, అనపర్తి, గోదావరి జిల్లా:— "గ్రంథము చాల భాగమును చదివి, అపరిమితానందమును బొందినాను."

రాంపల్లి సుబ్బారాయుడుగారు, కోటనందూరు, గోదావరి జిల్లా:— "చూచి బహు ఆనందభరితుడ నగుచున్నాను."

పొన్నూరు రామయ్యగారు, బ్రాహ్మణ కోడూరు, గుంటూరుజిల్లా:— "మీరు మనయాంధ్రసోదరులను మహోప కారమును బొంద జేసిరనుటకుసందియము లేదు. ఈ అమూల్యమగు గ్రంథముసలన వైద్యులకును తదితరులకును ఎక్కువ ఉపయోగము కలుగగలదని తలంచెదను."

కమలాపురము రాఘవాచార్యులుగారు, వైద్యరాజా, ఖిల్లా, గడగ్, ధార్వార్ జిల్లా:— "ఆంగ్లేయ వైద్యచింతామణి చాల రమణీయముగను, చాల లోకోపకార ముగను, ఉన్నది. ఇట్టిగ్రంథమును తామురచినందులకు అభినందించుటకు నామనస్సు చాలా కుతూహలత గలుగ జేయు చున్నది."

వి. రామమూర్తిగారు, బాపట్ల:— "తమరు వ్రాసినశైలి సులభముగా మాబోటి పామరులకు అర్థమగు లాగున వ్రాసినందులకు తమరు శ్లాఘనీయులు."

వేదాంతం కృష్ణమాచార్యులు గారు, చందవోలు, గుంటూరు జిల్లా:— "తమరంపిన ఆంగ్లేయ వైద్యచింతా మణియను అమూల్యగ్రంథ రత్నమును సమగ్ర ముగా దిలకించి అపరిమిత సంతోషాంబుధి నోలలాడి నాడ. ఇయ్యది, ఆర్షాయుర్వేద సంహితలంబోలి, ధర్మవైద్యశాల లన బరగిన యాస్పత్రుల పాలయి త్రివిధక్లేశంబు లనుభవించు నిరుపేదలకు పెన్నిధియు, సర్వజనులకు ననుష్ఠేయ విధియు, నయి యున్నది, ఈగ్రంథరాజము హైందవ పురో వృద్ధికి మార్గదర్శకమనియు ప్రతియింటను నొక ప్రతియుంట మిగుల శ్రేయస్కరమనియు, వ్రాయుటకంటె నొండభిప్రాయ ముండదని నాతలంపు."

కె. సుబ్బారావుగారు, నేటివు డాక్టరు, గుత్తి:—“ ఆంగ్లేయవైద్య చింతామణి యను గ్రంథమునందు అనేక విషయములు మిక్కిలి చాకచక్యములతో వివరముగా వ్రాయబడినవి. తెలుగుతెలిసిన వారంపరు దీనినిచదివి ఫలమనుభవించి గ్రంథకర్తగారియందు కృతజ్ఞులుగా నుందురుగాత.”

కె. తమ్మయ్యగారు, ఈనాందార్, ఆయుర్వేద విద్యార్థి, ప్రత్తిపాడు, గోదావరి జిల్లా:—“ ఆంగ్లేయ చికిత్స యందు పభిరుచిగల హైందవులకు ఆంగ్లేయ చికిత్సాసారము గ్రహింపగల తెలుగు గ్రంథములలో మొదటి గ్రంథమిదియే యనియు, గ్రంథమును రచియించుటలో గ్రంథకర్తగారు కాఠిన్య గూఢపదములతో గాక సాధ్యమైనంత సులభ శైలిలోరచించి ఆంగ్లేయభాషా జ్ఞానము లేని హైందవుల సంతసింప జేసినందులకు గ్రంథకర్తగారికి నామనఃపూర్వకమైన వందనముల దెలియ జేయగోరినాను.”

సియచ్. సూర్యనారాయణ గారు, బోడపాడు, గోదావరి జిల్లా:—
“ ఆంగ్లేయవైద్య చింతా మణిని బాగాపరిశీలనగా చూచినాను. నా స్నేహితులకు గూడా కొంతమందికి జూపితిని. చూచిన వారంపరు మీయెడల కృతజ్ఞత గనబరచిరి.”

బలభద్ర కోటయ్యగారు, పక్కలగడ్డ:—“ ఆంధ్రభాషాభివృద్ధికై పాటు పడు ఆంధ్రభాషాభివర్ధనీ సంఘమువారి గ్రంథముల కంటెను, గురువులతో బనిలేక గ్రహింప దగినటుల ననేకశాస్త్రీయ గ్రంథముల ముద్రించి చందాదారులకు స్వల్ప ధనమునకిచ్చి ఆంధ్రదేశమునకు జ్ఞానప్రకాశమొసంగుచున్న నవీన సూర్యోదయము వంటి విజ్ఞాన చంద్రికా మండలి వారి గ్రంథముల వలెను, నీ గ్రంథముపయుక్తముగా నున్నది. శైలి బాలురకును దెలియదగినటుల నున్నది. ఆరోగ్యము నిలుపు కొనుట కీ గ్రంథ మత్యావశ్యకమని కొనియాడవచ్చును.”

యర్రమిల్లి కామరాజుగారు, రాజమహేంద్రవరము:—“ వ్యయ ప్రయాసల కోర్చి మీరు దేశమునకు జేసిన మహోపకారమునకు నే నెంతయు గృతజ్ఞుడనయి యున్నాను. ఈ గ్రంథమును జదివినవారు యితర వైద్యుల సహాయమక్కరలేక యే స్వయముగా వైద్యమును జేసికొనగలిగి యుందురు.”

మన్నవ వెంకట కృష్ణశర్మగారు, మన్నవ, గుంటూరుజిల్లా—“సహిజీవితే దానాద్ధి దానమన్య ద్విశిష్యతే” అనుచరకోక్తి కర్తవ్యతమముగా నెంచి, వైద్య శాస్త్ర మభ్యసింప బూనువారికి కరదీపికవలె తమరంపిన ఆంగ్లేయ వైద్యచింతామణి

యత్యంతమైన సహాయము జేయగలదని నానమ్మకము. గురువునొద్దజదు వక్కరలేకయే సుసాధనముగానున్న యీగ్రంథము సకలజనుల గృహములయందును దప్పక యుండ దగినదని నాయభిప్రాయము.”

యం. నరసింహాచార్యులుగారు, శ్రీరామఆసుపత్రి, కళింగపట్నం: ఆంగ్లేయ వైద్యచింతామణి యనుగ్రంథమును సాంతముగా జూచితిని. చూచి అత్యానందమును బొందడమయినది. హిందూవైద్యులు యావన్మందికి ఆంగ్లేయ సాధనములు నడిపించుటలో తమచే వ్రాయబడ్డ గ్రంథముచే కరతలామలకముగా వ్యవహరించుటకు వీలయియున్నది. ఇదివరకు ఉండుకున్న ఆంగ్లేయపండితులు ఎవ్వరును ఆంగ్లేయవైద్య సాధనముల విషయమై తెలుగులో యింత వివరముగా వ్రాసియుందురని నేను తలచను.”

సూరి వెంకట పూర్ణానందముగారు, సత్తెనపల్లి:—“ తమరు రచించిన ఆంగ్లేయ వైద్యచింతామణిని జూచినాను. నా మనస్సుకు బహు ఆనందముగానున్నది. తమరు వ్రాసిన ఔషధముల వివరములు బహుచక్కగా నున్నవి.”

కె. ఎస్. నారాయణరావుగారు, మెడికల్ ప్రాక్టిషనరు, పాతపట్నం గంజాంజిల్లా:—“ తమరంపిన ఆంగ్లేయవైద్య చింతామణిని సాంతముగా జూచినాడ. తమ కాలమెల్లను నాటకములు మొదలగునవి రచించుటయందు వినియోగించు విద్యాధికులవలె గాక దేశాభివృద్ధి కనుకూలించు నొక విదేశ శాస్త్రమును, ఆంధ్రమండలంబునకు మండనంబుగ దెలుగుభాషను రచించితిరి. దేశాభివృద్ధికి ధనారోగ్యములు ప్రధానములు. ధనార్జనకు మార్గములును, ఆరోగ్య నిబంధనలును, రోగ చికిత్సలును, దేశదేశమునకు భేదించియుండును. వైద్యశాస్త్రమునకు మనదేశము పుట్టినిల్లయినను, ప్రస్తుత మన్నిచోట్ల విరివిగా వ్యాపించిన ఆంగ్లేయ వైద్యమునుగూడ నేర్చుకొని యందలి విశేషములు గ్రహింతురు గాకయని యుద్దేశించి అంగ్లేయవైద్య చింతామణి యనుపేర పుస్తకము రచించి ఆంధ్రభాషకు వన్నెతెచ్చిన గ్రంథకర్త యింక నిట్టివానిని రచించుట కారోగ్య మిచ్చుగాతయని యాదిదేవుని ప్రార్థించెదను.”

యన్. శేషశర్మా బ్రదర్సు, నేటివుడాక్టర్లు, అమృతలూరు, గుంటూరు జిల్లా:—“ శ్రీజిత్ సేతుబ్రదర్సు వారిచే నాంధ్రభాషలోనికి తర్జుమా చేయబడిన ఆంగ్లేయ వైద్యచింతామణి యనుగ్రంథమును మేము సాదరముతో గ్రహించి వీరల యెడ గృతజ్ఞులమగుచున్నాము. చాలవరకు హీనదశ యందున్న యాయుర్వేదమును ఆశ్రయించి పనిచేయుచున్న వైద్యులకు వీరిగ్రంథ రాజంబు నొసంగి

యాంధ్రప్రపంచమునకు మహోపకారమును జేసిరి. ఈ కోశ సహాయముచే సామాన్యులుకూడ నాంగ్లేయ చికిత్సల నందగలిగిరను నది వీరిమహోపకారమును సాటుచున్నది.”

బళ్ల సీతారామయ్యగారు, నేటివు డాక్టరు, వూలపల్లి, గోదావరిజిల్లా:—“ మీ గ్రంథమును జూచి ఆంధ్రదేశమునకు మీరుచేసిన మేలును వేనోళ్ల బొగడదగియున్నది. ఇట్టి గ్రంథముల నింకను జేయుటకు భగవంతుడు మీకుబుద్ధిపుట్టించి పూర్ణాయుర్దాయ మొసంగుగాత.”

యన్. గంగరాజుగారు, మెడికల్ ప్రాక్టీషనరు, రంగూన్:—తమరు పంపిన టువంటి ఆంగ్లేయవైద్యచింతామణినిగూర్చి బహుగా సంతోషించినాను. రెమిటెంట్ జ్వరము. టైఫాయిడ్ జ్వరము- వీటినిగురించి వ్రాసినవివరములకు బహుసంతోషించి ఆనంద ధారిని దేలుచున్నాను.”

కేతరాజు మాణిక్యారావుగారు, ఇంటూరు, గుంటూరుజిల్లా:—సేతుబ్రదర్సు వారివలన ప్రచురింపబడిన అమూల్య గ్రంథమగు నాంగ్లేయ వైద్యచింతామణి, ఆంగ్లేయ వైద్యమును దెలిసికొనగోరువారికి మిక్కిలి సహాయకారి యని నొక్కి వక్కాణింప నగును.”

జి. వెంకటరావు పంతులు గారు, హెడ్ మాస్టరు, రూరల్ స్కూల్, పేరలి, గుంటూరు జిల్లా :— “ ఆంగ్లేయ వైద్యచింతామణి యను గ్రంథమును ఆమూలాగ్రముగా జూతిని. నేను యిట్టి గ్రంథ మెచ్చట దొరకునోయని చాలకాలమునుండి యోచించుచుంటిని. మీగ్రంథమును జూచిన నాడు నాకు గలిగిన యానంద మింతయని చెప్ప జాలను. నేను హిందూ వైద్య శాస్త్రజ్ఞుడను. హిందూవైద్య శాస్త్రములకును దీనికిని, సరిపోల్చి చూచితిని. హిందూ గ్రంథముకంటె దీనియందు చాల సుగుణములు కలవు.”

దావెర్ల వెంకటరమణ రావుగారు, ఆయుర్వేదవైద్యులు, రాజమహేంద్రవరము :— “ ఏ గ్రంథమునుగాని ఒక్కభాషలోనుండి మరియొక భాషకు దెచ్చుట సులభముకాదు. విశేషించి పారిభాషిక పదజాలముతో నిండియుండు ప్రకృతిశాస్త్రములను ఆంధ్రీకరించుట మిక్కిలి కష్టసాధ్యము. ఈ గ్రంథము కేవలము ఒక గ్రంథాంధ్రీకరణము గాకున్నను, పారిభాషిక పదములను కేవలము తెలుగు తెలిసిన వారికి సహితము సులభముగ బోధపడునటుల వ్రాయుట యెంతయు శ్లాఘ

నీయును—ఈ గ్రంథము స్వదేశ వైద్యులకును, బుద్ధిమంతులగు సర్వజనులకును, మిక్కిలి ఉపయోగకరముగా నుండు ననుటకు సందేహములేదు. ”

పి. రామలింగశాస్త్రిగారు, ఆయుర్వేద వైద్యులు, తాళ్లరేవు, గోదావరి జిల్లా:— “ ఆంగ్లేయ వైద్య సముద్రమునందలి రత్నముల దీసికూర్చినట్లు కాన్పించు చున్నది. ”

బొంతా రామమూర్తిగారు, నేటివు డాక్టరు, మక్కువ, విశాఖపట్నం జిల్లా:— ఆంగ్లేయవైద్య చింతామణియను గ్రంథము చక్కగ వ్రాయబడి, మిగుల ఉపయోగ మయినదిగ గనుగొంటిని. నా ఆనందమును వెలిబుచ్చుటకు పదములు లభించనందులకు చింతిలుచున్నాను. గ్రంథము ననుసరించి కొన్ని మందులను ఉపయోగించి, అన్ని విషయములందును జయమందితినని తెలుపుటకు సంతసించుచున్నాను. ”

వేమూరి రాంజీరావుగారు, శ్రీ విద్యానివేదిక దీనజన సంరక్షక సంఘపు కార్యదర్శి, మచిలీ పట్టణము:— “ ఎంతమంది బీదలు వైద్య సహాయము లేక మృత్యువునోట బడుట మన కండ్లార జూచుచుండలేము! ఈ కాలములో గొన్ని విషయములందు ఇంగ్లీషు ఔషధములు పనిచేయునటుల తెలుగు ఔషధములు పని చేయుట లేదని నొక్కి చెప్పగలను. కాబట్టి ప్రతి ఆంధ్ర గృహస్థుడు నీ గ్రంథ రాజమును దెప్పించి, తాము బాగుపడుటయే గాక, తమసోదరులైన అనాథులగు పఙ్గ్వంధాదులకు సహాయము జేయుదురని తలచుచు, గ్రంథకర్తగారికి వారి యుద్యమమును గూర్చి నాకృతజ్ఞతా పూర్వకమగు వందనము లాచరించుచున్నాడ.”

రెవరెండ్ జే. సి. నైట్ ఆన్‌స్టేగారు, వెస్లేయన్ మిషన్, రాంకోట్, హైదరాబాద్, దక్కన్:— ఇట్టి గ్రంథమును తెలుగులో బ్రకటించినందులకు, వీరు మహోపకారమును జేసిరని నేను నిశ్చయముగ నమ్ముచున్నాను.



# Materia Medica in Telugu.

# ఆంగ్లేయ ఔషధగుణ దీపిక.



[ఆంగ్లేయ వైద్య చింతామణి యొక్క
గ్రంథకర్త వలననే.]

ఇందు ఆంగ్లేయ ఔషధముల యొక్క గుణ లక్షణములు వివరములతో వ్రాయబడియున్నవి. మా ఆంగ్లేయ వైద్య చింతామణిని గలిగియున్న ప్రతివారలకును యిది బహు ఉపయోగముగ నుండును. ఏఔషధము యొక్క గుణక్రమము నైనను, ఔషధ నామములను అకారాదిగ నేర్పరచి యుండుటచే, నిమిషములో దెలియనగును.

డెమీ 8 వ సైజునందు సుమారు 300 పుట లుండును. క్యాలికో బైండు. వెల రు 3—0—0. పోస్టుఖర్చులను గొనువారే భరింపవలయును.

ఈ గ్రంథము 1910 సం॥ ఆగస్టు నెలాఖరుకు సిద్ధము కాగలదు. వలయువారలు ఆర్డరులను రిజిష్టరు చేసికొనవచ్చును.

సేతు బ్రదర్సు,
మచిలీపట్నము.

# శ్రీకృష్ణుని జీవితచరిత్రము.

## మిగుల బ్రసిద్ధివహించిన గ్రంథము.



దేశ బాంధవ్ లాలా లజపతిరాయిచే, ఉర్దూభాష యందు, యిమ్మహామహుని దివ్యచారిత్రము బహు అద్భుత మగు సామర్థ్యముతో, మిగుల మనోహరముగ, నెట్టి మృత హృదయమున కైనను జీవము నొసంగునట్టి మాధుర్యతను వహించిన శైలిలో, రచియింపబడినది. దీనిని జదువునప్పుడు మేన బులకలు వొడమునని జెప్పుట అతిశయోక్తి కానేరదు. ఈ గ్రంధము ఉర్దూ భాషయందు మూడుమారులు ముద్రితమై, యిప్పుడు నాల్గవముద్రణమునకు సిద్ధముగనున్నది. ఇంతవరకు 30,000 ప్రతులైనను ఖర్చుపడి యుండవచ్చును.

ఇట్టి గ్రంధము, శ్రీరాజా రామమోహన రాయల చరిత్ర గ్రంధకర్తయగు శ్రీయుత కొణకంచి చక్రధరరావు గారు చక్కగ నాంధ్రీకరించి, ఆంధ్రజను లీ గ్రంధమును జదువుటకు వీలు కలుగ జేసినందులకు, వారలెంతయు గృతజ్ఞులయి యుండవలయును.

క్రవును 8 వ సైజునందు సుమారు నన్నూరు పుటలుండును. ఎల్లరకును అందుబాటునందుండునటుల వెల రు 1—4—0 గ మాత్రమే ఏర్పఱచబడియున్నది. పోస్టుఖర్చులు వేరైయున్నవి.

అచ్చులోనున్నది. త్వరలో వెలువడగలదు. దరఖాస్తులను బంపుకొనవచ్చును.

వెలయువారలు;—

నేతు బ్రదర్సు,

మచిలీపట్నము.